జ్యుఁడగు నీయన నతిక్రమింపరాదు.

(సమీపించి) అయ్యా! నమస్కారము.

రాగుఁడు—భద్రా! నీవు వేగముగాఁ గుమారజయంతునికి మహేంద్రునివర్తమానము ను జెప్పఁ బోవుచున్నవాఁడ వని తలఁచెదను.

చార—అగును.

రాగు—ఘంతోషవార్త యేమి?

చార—ఆర్యా! మాకును దెలియునట్లుగా నపహరింపఁబడినరతిని దనతేరిపై నిడుకొని పోవుచున్నశంబరుని వెనుదగిలి, సిద్ధమయినదేవసేనలతోఁ గూడి తొందరగా నంతకవరుణధనదవసురుద్రాదిత్యపరివృతుఁ డగుమహేంద్రుఁడు తరుముచుండ గాఁ ద్రోవయందు దాశంబరాసురునిసంబంధము గలశూరపద్మసింహాస్యతారక ప్రభృతు లగురక్కసులు పెక్కండ్రు మిక్కిలిబలముతో నడ్డము వచ్చినారు.

(అందఱును విషాదమును నటించుచున్నారు.)

రాగు—తరువాత. తరువాత.

చార—తరువాత, తడవులంబట్టి రాజుచున్నక్రోధానలము గలిగినదేవాసురసేన లొం డొంటిపయిం గవియుచుండఁగా

ఉ. అంతఁ జమూసమూహపతి యానమయూరముమీఁద నెక్కి య
త్యంతము వేగ ద్వాదశకరాంచితభీకరదీర్ఘహేతియై
సంతస మొప్పఁగాఁ బ్రమథసంగతుఁడై చను దెంచి దానవా
క్రాంతునిఁ గ్లాంతచిత్తుని బురందరుఁ జేరె మహాసహాయతన్.

రా—(ఆశ్వాసముతో) శక్తిధరుఁడు సమయమందే యందుకొన్నాఁడు. తరువాత. తరువాత.

చా—తరువాత, నేను నేనని యొండొరులం బాఁకెడునమరాసురవీరులదృష్టిప్రసారముల వరికట్టురంగదుత్తుంగతురంగఖురపుటోద్ధూతధరాపరాగముల నడఁగించెడిమద కుంభికుంభవిగళద్దానధారాసమూహములచేఁ గర్దమితంబైనయుద్ధప్రదేశంబున నరదంబులు గ్రుచ్చుకొనిపోవుచుంటచే నిష్పందస్యందనంబై పరస్పరాభిఘాతం బులచేత ఖణఖణాయమానంబై తద్దయు నొప్పుపెద్దసంగ్రామంబు జరుగుచున్న సమయంబున,

తే. గీ. శక్తిధరుశక్తిచేత వక్షంబు వగిలి
శూరపద్ముండు యమునియాగార మెంచెఁ

బోరి నవాఙ్ముఖుఁడై సింహముఖుఁడు గూలెఁ
దారుఁ డడఁగెను బర్వతస్తారుఁ డగుచు.

(అందఱును హర్షమును నటింపుచున్నారు.)

రాగుఁడు—మహాత్ముఁడు లోకత్రయహృదయశల్యము నున్మూలించినాఁడా?

చార—అయ్యా! నే నిఁకఁ గుమారజయంతునియొద్దకు వెళ్లుటకు సెలవొసంగవలెను.

రాగు—భద్రా! తరువాత కన్యాచోరునివృత్తాంత మేమిజరిగినది?

చార—అయ్యా! ఇట్లు పోరారంభమయినతరువాత నొండొరులపై శరములు వేసికొను నంతవఱకు మాత్రము కనఁబడి పిమ్మట నరదమునుఁ దోలఁగించుకొని యెక్కడికో దూరముగాఁ బాఱిపోయినాఁడు.

(ఇట్లు చెప్పుచునే వెళ్లుచున్నాఁడు.)

(అందఱును మూర్ఛ నొంది పుడమిపైఁ బడుచున్నారు)

పురోహితుఁడు—(ఖేదముతోఁ దొట్రుపడుచు శృంగారోదక మందఱిమీఁదను జల్లి) మహాభాగులారా! యూఱడిల్లుఁ డూఱడిల్లుఁడు. అతిమాత్ర మగునిట్టివ్యామోహముచే నేమిప్రయోజనము?

(అందఱు నూఱడిలుచున్నారు.)

రాగుఁడు—హా! కుమారీ! మిక్కిలి ముక్కిడియగునాటక్కరిరక్కసుచేఁ జిక్కితివిఁక నెట్లు జీవించి యుందువు?

ముదిత—హా! బిడ్డా! ఈలాటికష్టము ననుభవింపుటకేకదా! మందభాగ్యురాల నయిన నాకడుపునఁ బుట్టితివి.

సఖులు—ప్రియసఖీ! ఈలాగునఁ గానైయున్న నీతో మాకుఁ జెలిమి యేల కలిగెను?

పురో—మహాభాగుఁడా! మార్గమధ్యమునఁ గలిగినబలవత్ప్రతిబంధము పూజ్యుఁడయిన యాశక్తిధరునిచే నివర్తింపఁబడినది గనుక నింక నాయసురాధముఁ డెందుఁ బోయినను వెంబడించి సంహరించునుగాని వజ్రహస్తుఁ డూరక విడిచి వచ్చువాఁడు గాఁడు.

(ప్రవేశించి)

మయూరిక—(హర్షసంభ్రమములతో) అమ్మా! బాబయ్యగారూ! మీ కొకమంచిమాట చెప్పెదను.

రాగు—(ఆసక్తితో) భద్రా! చెప్పుము; మహేంద్రుఁ డమ్మాయిని విడిపించినాఁడా ? యేమి?

మయూ—బాబయ్యగారూ! భగవతి యని పలుకవలెను.

రాగు—అదెట్లుగాను?

మయూ—బాబయ్యగారూ! మనయమ్మాయిగారిని రక్కసుఁ డెత్తుకొనిపోయినవార్త చెప్పుటకు మీరు పంపఁగా భగవతియొద్దకు వెళ్ళిననాకిప్పు డమ్మాయిగారక్కడఁ గనఁబడినారు.

ముదితయు, సఖులును—అంతపున్నెమా?

రాగు—ఓసీ! నిజమేనా? నీవట్లు భ్రాంతినొందితివా?

మయూ—బాబయ్యగారూ! పూజ్యు లయినతమతో నే నబద్ధము మనవి చేయుదునా? భగవతి తనయోగమహిమవలన మనయమ్మాయిగారిలాగున నుండునట్లు మాయావతి యనునొకనాతిని నిర్మించి యాశంబరునరదమం దెవ్వరికిని దెలియకుండ నుంచి యామెను విడిపించినదఁట. ఇట్లు పూజ్యురా లయినవశినిగారు చెప్పినారు.

(అందఱును సంతోషముచేతఁ బరవశు లగుచున్నారు.)

రాగు—(పురోహితునితో) ఆర్యా! యెట్లిది? నేను నమ్మఁజాలకున్నాను.

పురో—మహాభాగుఁడా! ఇది యెంతవింత? భగవతి మహాప్రభావముగలదిగదా! ఇంతియకాక—

క. కలదానిని దొలఁగింతురు
కలిగింతురు లేనిదాని, గగనం బిలగా
నిల మిన్నుగా నొనర్తురు
కలవే సిద్ధుల కసాధ్యకార్యము లెందున్?

ముదిత—(ఉల్లాసముతో) ప్రియసఖి యగుసర్వార్థసాధిక బిడ్డలయందలికూరిమిని వెల్లడిచేసినది.

మయూ—బాబయ్యగారూ! అమ్మగారును మీరును మిక్కిలి దుఃఖించుచున్నారని నేనుజెప్పినతోడనే యమ్మాయిగారిని వెంటఁబెట్టుకొని యిక్కడకు వచ్చుటకు బయలుదేరినభగవతి నన్ను ముందుగాఁ బంపించుటచేత నేను వచ్చుచుండఁగాఁ బూజ్యులయినవసంతుఁడుగారియింటిదగ్గర, కుమారమన్మథుఁడుగారి కెదురుగా వెళ్ళుచు నాకుఁ గనఁబడినవార్తావహుఁ డగుకోకిలమునివలన మన్మథుఁడుగారును బూజ్యు లయినపార్వతీశ్వరులయానతి నొంది యింటికి వచ్చుచున్నా రని కూడ విన్నాను.

రాగు—మాకిది చేతిలోని మేలు. ఓసీ! యింకొకటివున్నదో, అమ్మాయి విడిచిపెట్టిన వర్తమానమును జెప్పకపోయినావా?

మయూ—బాబయ్యగారూ! సంతోషముచే నావలు మఱచియున్న నే నట్లు చెప్పుట మఱచిపోయినాను.

(ప్రవేశించి)

సారిక—బాబయ్యగారూ! ఇదిగో! భగవతి మధ్యంటికి వచ్చుచున్నది.

రాగు—(సంభ్రమముతో) అట్లయిన నాకెంతయు కర్తవ్యము.

(ఇతరులతోఁగూడ వెళ్లుచున్నాఁడు)

(తరువాత సారథిసమేతముగా రథస్థుఁడగు మన్మథుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మన్మ—(గతిని దలఁచుకొని పరితాపముతోఁ దనలో)

తే. గీ. కడఁగి యిచ్చట వేతొండుకన్నె నాని
యున్నకతమున నెట్టులో కొన్నినాళ్ళు
గడచె, నిప్పుడు కాల్చి మ్రుక్కరణి మఱలఁ
బడఁతియెడబాటు గాకింపఁబోడఁగె మిగుల.

అన్నా! నావలెనే ప్రియురాలును విరహానలముచే మిక్కిలి పొక్కుచుండు ననియే తలఁచెదను. పూర్వము నేను తండ్రిగారియానతి నొంది, దేవకార్యమున కై యమరావతినుండి వేగముగా బయలుదేరి వెళ్ళుచుఁ బూజ్యుఁడయినరాగుని ద్వారసమీపము నొందినప్పుడు

చ. బడలినయంగకంబులును, బల్మఱు నీరులుగ్రమ్ము కన్నులున్,
గడువడి నూర్పుగాడ్పులను గందినమోవియుఁ, బొంది వాందునన్
దడయక చెల్మికత్తె కయిదండ యిడన్ మెడ సాచి చూడఁగన్
బడఁతుక మేడపై నిలిచెఁ బాయక నే నటు లేగు టెంచుచున్.

(తలఁచుకొని) ఇదియే గట్టిగా నామనసును బట్టి పిడుచుచున్నది. తల్లిగారికి వయినదని యప్పు డప్పూఁదోఁటనుండి వెళ్లుచు—

ఆ. వె. కొన్నియడుగు లరిగి కన్నులనీరానఁ
దిరిగి చూచి "గుజ్జు తియ్యమావి!
యెప్పుడు మఱలఁ గంటి కింపొనర్తువొ" యనుచుఁ
గలికి మాటమరిచి పలికెఁ గాదె.

అన్నా! ఇప్పుడు—

చ. కడఁకను బూని యుండెనో కో! కామిని యేమొనరింపుచుండెనో
కడఁగి యయో! వియోగశిఖికాకకుఁ బ్రాణము లెట్లు నిల్పెనో
వడి జనునప్పు డామె కనవచ్చినయట్టియవస్థ నెంచి హా!
కడువగ నొందు డెందమునఁ గల్గకయుండునె యెట్టిశంకయున్.

(అపశకునములను సూచింపుచు ఖేదముతో)

మ. అదరంజొచ్చెను వామదృగ్భుజము లత్యంతంబుగా మేనునం
దిదె! బల్ చెమ్మట గ్రమ్మసాగె, మిగులన్ హెచ్చె వడంకొప్పెఁ, దా
నొదవెన్ గద్గదనిస్వనం బకట! యేమోకాని పల్మాఱు నా
హృదయం బింతికిఁ గీడుమూడు నని యెంతేఁ దల్లడిల్లున్ వడిన్.

(ముందువైపు చూచి) భయముతో వచ్చుచున్నవాఁడు మనవార్తావహుం డగు కోకిలకుఁ డని తోఁచుచున్నది.

(ప్రవేశించి)

కోకిలకుఁడు—దేవా! జయ మగుఁగాక! జయ మగుఁగాక!

మన్మ—కోకిలక! అతివేగముగా మఱల వచ్చుచు నీవు మిక్కిలి యస్వస్థహృదయుఁడవై కనఁబడుచున్నావేమి? మేము వచ్చుచున్నా మనువర్తమానము వసంతునికిని నతనివలనఁ, బూజ్యు లగుపెదతండ్రిగారికిని విశదపఱచితివా?

కోకిల—(భయముతో) దేవా! ప్రస్తుతము వసంతుఁడుగా రమరావతియందు లేరు.

మన్మ—(సందేహింపుచు) ఏమి? అతఁ డక్కడ నెందుచేత లేఁడు?

కోకి—(గద్గదస్వరముతో) స్వామీ! శంబరాసురుని దరుముచు వెళ్ళిన మహేంద్రుఁడుగారితోఁ గూడ సైన్యసమేతముగా వెళ్ళియున్నారఁట.

మన్మ—(కోపముతో) ఓరీ! తిన్నగాఁ జెప్పుము.

కోకి—(వణఁకుచు నభయమును గోరుచున్నాఁడు.)

మన్మ—భయము లేదు; ఏమి జరిగినదో చెప్పుము.

కోకి—దేవా! ఆకూళరక్కసుఁడు పూజ్యురా లగురతి నెత్తుకొనిపోయినాఁడఁట.

మన్మ—(కన్నీరు నించుచు) హా! ప్రియురాలా! యేమయిపోయితివో కదా! (అని మూర్ఛనొంది రథముపై నొరగుచున్నాఁడు)

సారధి—ఆయుష్మంతుఁడా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

మన్మ—(ఊఱడిల్లి కనికరముతో)

ఉ. నామదికెన్ మనంబు నయనంబులకున్ నయనంబు ప్రేమకున్
ప్రేమ సుఖాప్తికిన్ సుఖము ప్రేయసి సర్వధనంబు నాకు, న
క్కోమలి నైజభీరువగు గో వలబెబ్బులిచేతఁబోలెఁ బూ
ర్వామరుచేతఁ జిక్కె నిఁక నక్కట! ప్రాణము లెట్లు దక్కునో!

సారథి—ఆయుష్మంతుఁడా! ఇది విషాదమున కదను గాదు; ఆమెను మఱల విడిపించుటకుఁ దగినయుపాయ మాలోచింపవలెను.

మన్మ—సూతుఁడా! ఏమి సేయుదు నిపుడు—

ఉ. వ్రీడ నడంచుచుం బెనువివేకము డించుచు మేలితాలిమిన్
వీడఁగఁజేయుచున్ వినయబీజము వాపుచు మేటితాపమున్
మూడఁగ జేయుచున్ మది విమోహము గూర్చుచు నౌర! యింతనం
గూడనిరీతిఁ గల్గి యొకగొప్పవికారము న న్గలంచెడిన్.

సారథి—ఆయుష్మంతుఁడా! అగుఁ గాక; అయినను మీరిప్పుడు శత్రువును సాధించుటయం దుత్సాహము నొంది యుంటయే మిక్కిలి శ్లాఘనీయ మైనది.

మన్మ—(ధైర్య మవలంబించి) సారథిశ్రేష్ఠుఁడా! అగును; నీవు బాగుగాఁ జెప్పినావు.

క. ఓదార్పనముం దగు ప్రియ
మాదరమునఁ జెప్పువార లతిమాత్రము, సం
మోదమున హితముఁ బ్రియమును
గాఁ జెప్పెడువార లసదుగాదె జగానన్.

కోకిలక! మాతండ్రిగారితో, నే నొట్టువెట్టితిననియు మీరందఱు మఱల నమ రావతి నలంకరింపవలె ననియు నేనే వెళ్ళి వేగముగా నాదొంగగరువ మడఁగింపుదు ననియు మనవి చేయుము.

కోకి—చిత్తము. (అని వెళ్ళుచున్నాఁడు.)

మన్మ—సూతుఁడా! రథమును వైజయంతపురమునకుఁ బోవు మార్గముమీఁదుగాఁ బోనిమ్ము.

సారథి—(అట్లు చేయుచు నంతటను జూచి) ఆయుష్మంతుఁడా! ఇప్పుడు కలుగుచున్న యీయుత్పాతములను జూడుము. చూడుము.

చ. కలుషతనొందె నద్దెసలు గాఢత వెగ్గెడు సూర్యుఁ డెంతయున్
బెలుచ యుగాంతమందుఁబలె వీవఁదొడంగెను. గాలి తీవ్రసన్

మన్మ—(ఉల్లాసముతో)

బలువిలునారిలాగకయె పల్కులు మ్రోయఁదొడంగె, వేమఱున్
వెలువడఁ జొచ్చెఁ దాముగనె వేగ నిషంగమునుండి బాణముల్.

సారథి—(మన్మథుని హర్షమును వృద్ధిచేయుచు) ఆయుష్మంతుఁడా!

తే. గీ. దారుణోత్పాతములు తొల్త దళము కొనియె
నల్ల మలరించు శకునంబు లొదవెఁ బిదపఁ
గానఁ గను గొప్పకయ్యంబు గల్గియందుఁ
గలుగు నెల్లరు నలరెడు గెలుపు మనకు.

(దక్షిణపు దిక్కు చూచి)

చ. గురుతరమంపరభ్రమణఘూర్ణితవారిధియట్లు మ్రోయుచో
శిరవ పెంపంగె, నింగి నదె. రేణువులు గప్పె యుగాంతవారిదో
త్కరములువోలె, మించులవిధానఁ జలింపుచు దిక్కులందుఁ
గరపుఁబతాక లొప్పె నటుగాన సమీపమునందె తోఁపయుం
దరిభటసేన లుండెనని యాత్మఁదలంచెద నిశ్చయంబుగాన్.

మన్మ—(అవలంబింపుచు) అదృష్టవశమున నాధనుర్వ్యాపారమున కవసరము సమీపించినది.

సారథి—(చింతింపుచు) ఆయుష్మంతుఁడా! ఒక్కవిల్లుమాత్రమే సహాయముగాఁ గలమీకు, మహాబలసమేతుఁడగు నారకాసుని నిగ్రహింప నెట్లు గెలుగునో యని సందేహింపుచున్నాను.

మన్మ—(విలాసముతో) సారథీ! నాభుజబలము నెఱుఁగనివానివలె నీవును నిట్లాలోచింపుచున్నావేమి?

ఉ. మానితరీతి నేగి హనుమంతుఁడు గెల్వఁడె లంక నొక్కఁడే
మానుగఁ దార్క్ష్యుఁ డొక్కఁడె యమర్త్యులఁ గెల్చి సుధన్ హరింపఁడే
మానక గెల్వఁడే కురుకుమారులఁ బార్థుఁడు గోగ్రహంబునన్
గాన సహాయ మేల? రిపుగర్వ మడంపఁగ నాకు నియ్యెడన్.

సారథి—(ఎదుటను నిరూపించి) మీరథమం దలంకరింపఁబడిన ధ్వజమకరమును జూచి మీరు పోరికి వచ్చుచుండిరని తెలిసికొని మీపగవాఁడు సైన్యమును విడిచి యొంటరిగా నరదమును దొలఁగించుకొని మిక్కిలి దూరముగాఁ బాఱిపోయి నట్టు కనఁబడుచున్నాఁడు.

మన్మ—(సరభసముగా) సూతుఁడా! అట్లయిన శత్రుసేన నెడమ వైపుగా విడిచిపెట్టి

మనయరదము నయ్యసురాధమురథమున కెదురుగాఁ బోనిమ్ము.

సారథి—(కశాహతిచే గుఱ్ఱములను వేగముగా నడిపించుచు నాలాగుననే తోలు
చున్నాఁడు.)

(తరువాత రథస్థుఁ డగుశంబరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

శంబరుఁడు—(మన్మథుని జూచి హేళనముతోఁ దనలో) ఈపంచబాణుఁడు నాచేతి
నే జిక్కినయిక్కలికని మఱలించుకొనఁ దలఁచునట్ల కుళింగవిహంగము భంగి
ననుసరించుచున్నాఁడు.

మన్మ—(శంబరునిరథమందుండిన మాయావతిని జూచి విషాదముతోఁ దనలో)

తే. గీ. తతమరుప్రాంతమున మెట్టదమ్మివోలె
వృకముకడ భీతిఁగొను లేడిపిల్ల వోలెఁ
గటికచీఁకటి లేనెలకలయు వోలెఁ
జెలిచెలువుఁ బాసె రక్కసుచెంత నకట!

మఱియు—

మ. ఎదుటం జేరుచు నున్ననన్నుఁ గన దోకేకింతయైనం, బ్రాణాలకిం
పదు మోదంబలరార మామకధనుర్జ్యారావమున్, భీతి
నన్నెదురన్ లేకరిసేన పర్వ్విడఁ దా నింతేని సంతోషమొం
దదు, గానన్ జెలి మూర్ఛనొందె ననుచుం దథ్యంబుగాఁ దోఁచెడిన్.

(శంబరు నుద్దేశించి రోషముతో)

ఉ. ఓరిదురాత్మ! రోషసహితోరగదంష్ట్రను లాగుటే సుమీ!
ధీరమృగాధిపావసట తెంపునఁ దెంపఁగఁ బూనుటే సుమీ!
ఘోరతరాసిధారఁ గడుఁగొబ్బున నాకఁ గడంగుటే సుమీ!
క్రూరత నిట్టులీపడఁతిఁ గోర్కెను జేకొనఁ గోరు టెన్నఁగాన్.

శంబరుఁడు—(సోత్ప్రాసముగా) ఓరిపుష్పశరుఁడా! సర్వజనసాధారణ యగుకన్యకకు
గాను శంబరునితోనె యెదుర్కొన వచ్చిననీ బుద్ధికుశలత తేటపడినది. రహస్య
మునందు స్త్రీపురుషులను గలిసికొనఁజేయునట్టిశౌర్యము గలిగిననీవీయుద్ధముఖ
మున నుండి వేగముగాఁ దొలఁగుటయే మేలు. అట్లుగాక నీకును యుద్ధము
నందే శ్రద్ధగలుగునేని రమ్ము; అదియుం జూతము.

మన్మ—(కోపముతోఁ గూడినచిరునగవుతో) మూఢుఁడా! ఆత్మస్తవ మిఁకఁ జా
లును. పెక్కుమాటలు నేర్చిననీకు బాణములచేతనే బదులు చెప్పుదును;

మఱియుఁ గలహప్రియుఁ డగు నామహామునికి యుద్ధమును జూచుటయందలి కుతూహలమును గూడనిండింతును.

(ఇట్లు శంబరమన్మథులు వెళ్ళుచున్నారు.)

(తరువాత ఆకాశయానమున నారదుఁడును నతనిశిష్యుఁడును ప్రవేశించుచున్నారు.)

నారదుఁడు—(ఆనందముతోఁ గూడినయాటతో వీణను మీటుచు)

ఉ. వేమఱుఁ గల్గువేల్పు తొలివేలుపు బల్ విలుకాండ్ర వింతసం
గ్రామపుసాహసంబులను గల్మషముల్ హరియింపఁ జాలిబల్
క్షేమ మొసంగునీశ సరసీరుహనాభుల పావనంబు లౌ
నామములన్ సుఖింపుదు ననారతమున్ జగతి న్నటింపుచున్.

శిష్యుఁడు—(అబ్బురముతో) మహాత్మా! మీ రేయేయద్భుతములయినయుద్ధములను జూచినారు?

నారదుఁడు—(తలయూపుచు) వత్సా! బాగుగా నడిగినావు.

చ. ఖలు దితిజాధిపుం బెనునఖంబుల జీరినశౌరిశౌర్యమున్
జలమున నప్పురత్రయి వెసన్ దహియించిన రుద్రు తేజమున్
బలవధయందుఁ గ్రుద్ధుఁ డగువజ్రిమగంటిమి దేవదానవుల్
దలపడి చేసినట్టియలతారకుఁ గూర్చినపోరుఁ జూచితిన్.

ఇంకను బెక్కులు లోకప్రవీరుల మహాఘోరయుద్ధములు గూడఁ జూచి యున్నాను.

శిష్యుఁడు—మహాత్మా! అట్టి యాహవదర్శనలాభము సంభవింపనిదినములయందుఁ బూజ్యులయినతమ కానంద మెట్లు గలుగును?

నారదుఁడు—వత్సా! నీవు బుద్ధిమంతుఁడవే.

ఉ. కూరిమిగల్గు నాల్మగలె కొద్దిమిషన్ గలహంబు పూనినన్
గోరికమీఱ భక్ష్యములఁ గోరుచు బాలుర పోరొనర్చినన్
దోరపు టెద్దు శృంగములతో నడిత్రోవ రణం బొనర్చినన్
సారెకుఁ గాంచినర్తనము సల్పుదు నెంతయు సంతసింపుచున్.

శిష్యుఁడు—(నవ్వుకొని తనలో) ఎవ్వరికైనను స్వభావమును మర్పించుకొనుట దుష్కరము గదా!

నారదుఁడు—ఇప్పుడు భువనైకశూరు లగుశూరపద్మాది రాక్షసులను దనబాణములకు గురిచేసికొనిన కుమారునిచేత నేత్రానందము నొందింపఁబడినవాఁడ, మఱల మహా

సైన్యసమేతుఁ డగుశంబరుని మర్దింప నున్నజనార్దననందనునిచే మనోరథపూర్తి కూడఁ గాఁగలదు.

శిష్యు—ఆర్యా! సదా పిండివంటలతోనే భోజనము సేయుచుండువానికి దైవ మాలాగున నే కలుగఁజేయుచుండును. కాని నా కీసందియము మాత్రము గట్టిగా బాధింపుచున్నది. శంబరీసహస్రముచే జయింప నలవిగానియా శంబరుఁడు మన్మథునిచే నెట్లు గెలువఁబడును?

నారదుఁడు—శంబరుఁ డెట్లు గెలువఁబడునని సందియము నొందఁ బనిలేదు.

క. వారక మృగఖగనరసుర
వారము నెవిమోహపెట్టి వశపఱచుకొనన్
నేరిచినమాయలాఁ డగు
మారునికడ నెట్లు వానిమాయలు పొసఁగున్?

(ఎదురుగాఁ జూచి) శంబరునిమార్గమునుబట్టి పోవుచున్నమన్మథునిరథమునకడ్డు మారినయసురబల మెంతహెచ్చుగా నున్నదో చూచితివా?

చ. ధరణి మదాంబుధారలను దద్దయుఁ బంకమునొంద, దిక్తతుల్
కర మదరంగఁ దొండములఁ గల్గినఘీత్కృతిసత్వరంబునన్
సురల విమానముల్ దొలఁగఁ జోద్యపుదంతపుదెబ్బలన్ పయో
ధరములు వ్రయ్య, బృంహితతతధ్వను లొప్పెడు వప్రకేళులన్
ధరములు మాఱుమ్రోయ నదె! దద్దయు నొప్పెడుఁ గంటె యేనుఁగుల్.

శిష్యు—ఆర్యా! ఈవైపునందును—

చ. ఖరఖురతీవ్రఘట్టనలఁ గల్గినసాంద్రరజంబు భూనభోం
తర మరికట్ట బిట్టు రణధారుణి నాడుచు రమ్యహేషలన్
గరము రచింపుచుం జెలువుగ్రాల నధిష్ఠితసాదివర్గమై
తురగపుచాలు చూపరకుఁ దోరపువేడ్క యొసంగెడున్ గడున్.

నార—వత్సా! ఇదిగో! ఇక్కడ—

ఉ. సారథి నేర్పునన్ మిగులఁ జక్కనిత్రోవనె పోవుచున్ వడిన్
సారెకు ముందుఁ బోవుతమచాయలు గుజ్జము లంచు మీరఁగాఁ
గోరెడుతేజు లొప్ప ధ్వజకోటులు సూర్యునిత్రోవ కడ్డమై
మీఱ నెసంగు తేరగమి మేటిముదం బిడుచుండెఁ గంటివే?

శిష్యుఁడు:—మహాత్మా! ఇక్కడను—

మ. పదఘాతంబుల నేల గ్రుంగ హరిశబ్దాలన్ దెసల్ వ్రయ్య బల్
పదనుంగత్తుల మత్తశత్రులు దెగన్ బల్మారుఁ జక్రభ్రమం
బొదవన్ జిత్రముగా నటింపుచు నొహూహో యుద్ధావనిం జూపరన్
ముదమొందింపుచు నుండి రుద్భటభటుల్ పూర్ణప్రతాపంబులన్.

(భయముచే వడఁకుచు) నడికడలియందలియోడవలె శత్రుబలమునడుమనున్న మన్మథుఁ డెట్టు లొడ్డు చేరఁగలుగునని నేను మిక్కిలి జడియుచున్నాను.

నారదుఁడు—వత్సా! జగదేకవీరుఁ డగుమారుని కి దెంతోపని కాదు. నమ్ముము. ఇదిగో! ఇతఁడు.

మహాస్రగ్ధర.

బలమారం జక్రపాళిన్ భటుల కరశిరఃపాదముల్ ద్రుంచుచున్ బల్
చలమొప్పం దేజులం బ్రాసముల జదుపుచున్ సామజాళిన్ గదాపం
క్తులచేఁ జక్కాడుచున్ ముల్కల నరదములం గూల్చుచున్ దైత్యసేనం
బొలఁగంగాఁ జేసి యక్కంతుఁడలరెఁగడుఁబాధోదముక్తారుకమాడికిన్.

ఇది యొకనిమేషములోనే యితనివలన—

మ. అసిధారా పరిఖండితాశ్వగజదైత్యానీక మేదోవసా
దిసమేతప్రబగుర క్తపేటిగము లెంతే విస్రగంధంబుతో
వెసఁ బాఱం బెనుమొండెముల్ గదల వేవేగన్ వృకాద్యాళిసం
తస మొందన్ రణభూమిత్రృప్యదురభూతప్రేతమయ్యెన్ గడున్.

శిష్యుఁడు—ఆర్యా! ఇఁకమీఁద దుష్కరముగా నుండునని యూహించెదను. సూర్యుఁ డస్తమించుచున్నాఁడు. దట్ట మగునీకటికచీఁకటులచేఁ దనవాఁడును బెఱవాఁడు నని యానవాలుపట్టుట కష్టముగానుండును. రక్కసుల కట్లు గాక రాత్రులందే బల మధికముగాఁ గలిగియుండును గదా!

నారదుఁడు—పిరికివాఁడా! వెరువకుము; ఇదియంతయు, శస్త్రపాతములచేఁ బడమింబడినచతురంగసేనలు గలిగినవాఁడు గావున నాశంబరుఁడు తనశంబరీబలముచేఁ బ్రయోగించిన తామసాస్త్రము ప్రభావము కాఁబట్టి యీలాగున—

ఉ. కాలకృశానురుద్రముఖ కల్పిత ధూమభరంబు లట్ల, పా
తాళమునుండి వచ్చుబహు దైత్యతతుల్ వలె, సంచరించుబల్
నీలశిలాద్రులంబలెను, నిర్దళితాంజన రాసులంబలెన్
జాలఁగఁజీఁకటుల్ ప్రబలిసర్వదృశాప్రసరంబడంచెడిన్.

శిష్యుఁడు—(అబ్బురముతో) మహాత్మా! కల్పాంతమం [illegible] [illegible] సూర్యు లుదయింప రని వినుచుందుము; ఇప్పుడిదేమి [illegible] [illegible] కాలదినసూర్యు లుదయింపుచున్నారు.

నార—వత్సా! తామసాస్త్రగర్వ మడఁగించుట [illegible] ప్రయోగింప బడిన ప్రభాకరాస్త్ర ప్రభావమున—

చ. [illegible] వుల బావులన్ గలుగుజీవన [illegible] [illegible] యుండన్
[illegible] ములచేత గూఢకవికాంచిలాద్యు [illegible]
సగుడు జిహ్మ [illegible] కటుల [illegible] దోలుచు [illegible]
[illegible] సంతటం బ్రబలెఁ గంజముదావహా భాస్కరావళుల్.

శిష్యుఁడు—(ఉద్వేగముతో) మహాత్మా! [illegible] లోకాంతము సేయుటకే పూనుకొన్నాఁడు. [illegible]

శా. ధారాపాతశతంబులన్ [illegible] [illegible] వర్షఁ, గే
కారావంబుల నెమ్మి లాడఁ, గరకాఘంబుల్ వడన్ జంచలా
వారం బొప్ప, మహేభబృంహితగతిన్ [illegible] మ్రోయఁగా
వారి న్నించఁదొడంగె నబ్బురముగా వర్షాంబుదానీకముల్.

నార—వత్సా! ఇది యాదుష్టుఁడు ప్రయోగించినపర్జన్యాస్త్రమహిమ. అస్త్రప్రయోగమందు మిక్కిలి సమర్థుఁడయినకందర్పుఁ డయ్యస్త్రగర్వ మడఁచుటకుఁ దగిన వాయవ్యాస్త్రము ప్రయోగించినాఁడు. [illegible]

చ. తరువులు గూల, వారిధు లుదారతఁ బూన్నిల, సౌధముల్ పడన్
ధరములు చంచలింపఁ, గడుదట్టపుధూళిని నెల్లవిష్టపో
త్కరములు మున్గ, దూదివలెఁ దద్దయుఁ జూర్ణగ నల్లమబ్బుచాల్
దరల యుగాంతమందుఁబలెఁ దానిదె! బల్ సుడిగాలి వీచెడిన్.

శిష్యుఁడు—(వడఁకుచు) మహాత్మా! నేలలు మాచువేసుకొనఁ జాలును, ఇదిగో! ఱెక్కలు గలిగి పెక్కులుబలుగొండలు పైకెగసి పసుచు నంతటనునిండియున్నవి; ఇఁక మన కావలకుఁ బోవుటకయిన నవకాశము కల్గదు; [illegible] గా నిక్కడనుండ తొలఁగి పోదము రండు.

నార—ఓరీ! దుర్మార్గుఁడగు నారకాసుఁడు పార్వతాస్త్రము ప్రయోగించినాఁడు.

శా. ఆశాంతంబులఁ బాదముల్ వఱలఁగా, నత్యున్నతకూటంబు లా
కాశం బాన, నిపాతవేగమున [illegible] [illegible]

ట్లాశుప్రక్రియ వెల్లువల్ జరుగఁగా, నత్యుగ్రవాతంబు లెం
తో శీఘ్రంబ గుహాళి వెల్వడఁగ నద్రుల్ గప్పెఁ గంజే భుజిన్.

శిష్యుఁడు—(భయముతో) మహాత్మా! ఇప్పు డేమి చేయుదును? ఇదిగో! పెద్దయేనుఁ గులంతలేసిగండశిలలు పడుచున్నవి! అయ్యో! మాతలిదండ్రులకు నేనొక్కఁడనే కుమారుఁడను గదా!

నారదుఁడు—(నవ్వి) వత్సా! విచారింపకుము. దీనిని దొలఁగించుటకు వజ్రహస్తాత్మజ నందనుఁ డుపాయము గనిపెట్టినాఁడు. ఇదిగో! చూడుము.

ఉ. గ్రక్కున నెక్కలన్ నరుకఁ గారెడు నెత్తుటిధార లొప్పఁగా
జెక్కులు శృంగపుంగముల పెద్దశిలల్ వడి నేల రాలఁగా
నక్కజపుక్ష్మలల్ పగిలి యారవముల్ బధిరంబొనర్పఁగా
మిక్కిలి విస్ఫులింగములు మీఱ శతారము లొప్పె నెల్లెడన్.

శిష్య—మహాత్మా! ఎట్టులేని శాంతించినరోగముగలవానికి మఱల భూతావేశము గలిగినట్లు పూత్కారములతో ప్రసరింపుచున్న విషజ్వాలాసముదాయములచేఁ జెట్టుల నన్నిటిని మండఁ బెట్టుచుఁ బెక్కులుచిలువగము లొక్కనిమేషమాత్రముననే యిట్లంతటను వ్యాపించుచున్న వేమి సేయుదును?

నార—వత్సా! జడియకుము.

క. గురుభోగత్రోటనపటు
వరచంచ్వగ్రములచేత ఫణరత్నములన్
ద్వరతోడ నెగరఁ గొట్టెడు
గరుడులవలన్ నశించెఁ గను మవి త్రుటిలోన్.

శిష్య—మహాత్మా! రక్కసుఁడు ప్రయోగించినపన్నగాస్త్రమును బన్నగరిపుధ్వజనందనుఁడు గారుడాస్త్రప్రయోగముచే శాంతింపఁజేసినాఁడని తోఁచుచున్నది.

నార—వత్సా! అగును బాగుగా నూహించినావు.

శిష్య—ఆర్యా! ఇట్లు తాను బ్రయోగించుచువచ్చినయస్త్రము లన్నియు నిరర్థకము లయినవని యాశంబరుఁడు మాయాయుద్ధము చేయనారంభించు నని యూహించెదను.

నార—చేయనిమ్ము; శ్రితమాయుం డగునీమన్మథుఁడును [illegible] తెఱగులఁగూడ వానిపొగ రడఁగింపఁగలఁడు.

శిష్య—ఆర్యా! ఇదిగో! చూడుఁడు; చూడుఁడు.

మహాస్రగ్ధర.

కరవాలం బూని బల్భీకరపురుషుఁడు కన్గొంప నొప్పెం బ్రచండుఁడై

నార— కర ముగ్రంబౌచు వానిం గనికర మఱి ఖడ్గంబుచే ఖండితుండై

శిష్యు— గరువంబుం జూపి దానిం గడచుచు మఱి యుద్దీప్తకీలాకలాపున్

నార— త్వరగా సర్వాండజోక్తీశ్వరశరభ మదే! దాని జక్కాడె శీఘ్రన్.

మఱియు—

సీ. పిశితాశనుఁడు హేమకశిపు నాకృతి నొందఁ గంబంబునఁ నృహరిరూపుఁ జెందె
యసురుండు బలిదైత్యు నాకృతి వహియింప హరుండు వామనాకారమూని
సురవైరి యాదుష్టనరకాకృతిని జెందఁ గామ్యఁడు శౌరియాకార మొంది
రక్కసుం డలక్రూరరావణాకృతి నొంద ననవిల్తుఁ డారామతనువుఁ దాల్చి

తే. గీ. మఱియు నీరీతి శంబరమానవాశి
యేకకాలంబునను బూనె నెన్నిరూపు
లన్నిటికి నన్నిరూపంబు లప్పుడ తాల్చి
దర్పకుఁ డడంచుచుండెఁ దద్దర్ప మెల్ల.

శిష్యు—(ఆశ్చర్యముతో) మహాత్మా! ఇదేమి? యుద్ధరంగమున శంబరుఁడును వానిబల మును గూడఁ గానరాక మన్మథుఁ డొక్కరుఁడు మాత్రమే కనఁబడుచున్నాఁడు

నార—వత్సా! శంబరునివలన నా మయమారీచ మేఘనాదాదులును మాయనభ్యసించి యే యున్నారుగాదా!

శిష్యు—అయ్యో! ఇఁక మీఁద దుర్లభమని శోకించుచున్నది. ఒక్కశంబరుని చేతనే వ్యామోహము నొందుచున్న మన్మథునికి వేయిశంబరు లెదురైనప్పుడు గెల్పునందుఁక నేటియడియాస?

నార—వత్సా! అన్నిటి కన్నియు నయినమన్మథ ప్రతిరూపములచే వికలఁబడినరూపు లచేఁ దెగిపడిపోని నీవు చూచితివా [illegible]
నిప్పు డన్నివిధములచేతను [illegible]
మన్మథుని శరాహతిచే గజ్జనములను, [illegible]
బుసకొట్టుచు మిక్కిలి ఖేదముగలమనసుతో దాల్చుట మాత్రమే కోపము గాఁ గలిగి యేమియుఁ జేయఁజాలక యూరక పడియున్నవాఁడు.

శిష్యు—(సంతోషముతో బుజములిమిడియు శ్రీయుపుమడతి నెగరవైచుచు) బాగు మన్మథుఁడా! బాగు! శంబరునిగర్వాడంబర మంతయు నడఁగఁ ద్రొక్కినావు.

(తెరలో జయకాహళ శంఖధ్వనులతోఁ గూడిన దివ్యనిస్సాణధ్వని)

శిష్యు—(సంభ్రమముతో) మహాత్మా! ఇదేమి? వర్షాకాలమేఘములవలనఁ బుట్టినయురుములచప్పుడి లాగునను, మందరనగముచేఁ దరచఁబడినప్పుడు కడలియందుఁ గలిగినమహాకల్లోలకోలాహలములాగునను నొకగొప్ప భేరీకారవము వినఁబడుచున్నది.

నార—(సంతోషముతో) వత్సా! నీవును జూచియే యుంటివి గాదా!

తే. గీ. మహితసమ్మోహనాస్త్రసామర్థ్యమున, వి
మోహితుని జేసి కరవాలమునను దలను
ద్రుంచి శంబరుఁ గ్రిందికిఁ ద్రోచి మరుఁడు
తనరథంబునఁ బ్రియతోడఁ దనరుచుంట.

కాఁబట్టి వేల్పు లెల్లరు విజయోత్సవము చేసికొనుచున్నారు.

శిష్యు—(చూచి) ఇదిగో! సంభ్రమముతో దేవర్షులు కురియించుచున్న పూలవానచేత వ్యాపింపఁబడుచు యుద్ధమునందుఁ బొందిన గెల్పువలచ్చిచే మిగుల శోభఁగాంచి త్రిలోకవీరుఁ డగుమారుఁ డమరావతికి వెళ్లుచునే యున్నాఁడు.

నార—వత్సా! మనముగూడ మన్మథునివిజయవార్తను జెప్పుటకు వెళ్లెదమునింద్రునిచారులందఱికంటె ముందుగా వెళ్లి తోఁడివినుండి యిప్పుడే వచ్చియున్న భగవంతుఁ డగునుపేంద్రునికిని నింద్రునికిని నీశుభవర్తమానము చెప్పి సంతసముఁ గలిగింతము రమ్ము.

(ఇట్లందఱును వెళ్లుచున్నారు.)

ఇది సత్యవోలు కామేశ్వరరాయనిచేఁ దెలిఁగింపఁబడిన
రతిమన్మథనాటకమునందుఁ జతుర్థాంకము.

శ్రీరస్తు.

# రతిమన్మథనాటకము.

## పంచమాంకము.

(తెరలో డిండిమధ్వనితో బిగ్గరగా)

పురజనులారా! వేల్పుఱేఁ డగునింద్రుఁ డీగా కిట్టు లానతిచ్చుచున్నారు.

"ఉ. ఎల్లెడలన్ బతాకలను నెత్తుఁడు, కట్టుఁ డనంటి వెట్లుచా
లెల్లగృహాగ్రదేశముల, నింపుగఁ జల్లుఁడు పూలు త్రోవలం,
దెల్లెడఁ దోరణంబులు ఘటింపుఁడు, ఘోషలు ... జేయుఁడీ
యల్లదె! వచ్చుచుండె నియు హుంది కుమారుఁడు మారుఁ డేపుగాన్.

(చూళిక)

(తరువాత భయముచేఁ గన్నులు మూసికొనినమాయావతి బిగ్గరగాఁ గౌఁగిలించుకొనుటచే గగుర్పొడిచినమేనుగలిగినమన్మథుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మన్మ — (సుఖాతిశయమున ... దనలో) ఆహా! ఈమె నెత్తుకొనిపోయియు ను శంబరుఁడు నాకు మేలే చేసినాఁడు.

చ. జడిసినలేడికింబలెను జంచలమౌకనుదోయి నశ్రువుల్
విడువక క్రమ్మ, నెమ్మొయిని వింతవడంకు జనింప వేగ నా
మెడ కయిదోయిఁ జుట్టి బిగి మీఱఁ దనంతన తొట్రుపాటుతోఁ
బడఁతుక కౌఁగిలించుకొని పాయక యీయెడ హాయిఁ జేయుటన్.

మఱియు నిక్కాలంబున—

చ. పులకలు లెవ్వంగ సంగమునఁ ... జెమ్మటలు గ్రమ్మె నెమ్మొయిన్,
తొలఁగెను ధైర్య మంతయును ... మెంతయున్,
లలితపుసమ్మదాబ్ధియలలం ... నోలలాడుచున్
కొలఁగెను, నాదుడెంద మతివిభ్రమం బగునొక్కరీతిచేన్.

(చూచి) అకటా! భయశీలురా లగునీమె యింకను నూఱడిల్లకున్నది.

సీ. జంకునొందినయట్లజింకపిల్లకుఁబోలె నెంతేని గనులు చలింపుచుండెఁ
బెనుగాలిచే నాడుననఁటాకుచందాన వడిమీఱ నెమ్మేను వడఁకుచుండె
బిట్టు గల్గుచునున్న నిట్టూర్పుగములచేఁ బైఁట పల్మరుఁ జిమ్మఁబడుచునుండెఁ,
గడువేగముగఁ గారుకన్నీటియేటిచే వాతెఱ కడుగఁగఁబడుచునుండెఁ

తే. గీ. గొప్ప విడి మూపునం గురు లొప్పుచుండె
సోయగపుమోమున నొకింతచాయ దరిగె
నన్న! యిట్లున్న యీయన్నుమిన్నఁ గన్న
నుల్ల మిప్పుడు కడుఁ దల్లడిల్లుచుండె.

(ప్రకాశముగా) సుందరీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. మన్మథునిరథమందేయుండినను నీకింకను భయశంక యేటికి?

మాయావతి—(ఆశ్వాసముతోఁ గన్నులు విప్పి మన్మథుని జూచి తనలో) యీతఁ డెవ్వఁడొకో! మిక్కిలికనికరము గలడెందముతో నన్నీయాపదనుండి విడిపించి యిట్లు ప్రేమపూర్వకముగాఁ బలుకుచున్నాఁడు. ఇంతియ కాక, చిరకాలము పరిచయముచేసినవానియందువలెఁ జూచినతోడనే నాకీయనయం దీలాగున నను రాగము పుట్టుచున్న దేమి? అగును- ఇతఁడు నాకుఁ బ్రాణదానము చేసినాఁడు కనుక. (ప్రకాశముగా) మహాభాగుఁడా! మందభాగ్యురాల నయిన నాకొఱకుఁ గాను బూజ్యులగుమీయాత్మ మిక్కిలి యాయాసపెట్టఁబడినదిగదా?

మన్మ—మంజుభాషిణీ! నాకేమియాయాసము? ప్రసిద్ధ మయినపరితాపము గలనేను, నిన్నే యపహరించినయాదుష్టు నెట్లు సహింతును?

మాయా—(తనలో) ఏమి యీమహాభాగుఁడు నన్నుఁ దనదానినిగానే యెంచుకొని చెప్పుచున్నట్టు కనఁబడుచున్నది! అవును సత్పురుషుల కన్యులనువారే లేరుగదా? (ప్రకాశముగా) మహాభాగుఁడా! ఇట్లు స్వదేహపరిశ్రమము నెంచుకొనక, రక్కసునిచేఁ బట్టుపడిననన్ను విడిపించినతమకు నేనేమిప్రత్యుపకారము చేయఁజాలుదును? అన్నివిధములచేతను క్రయవిక్రయములకుఁ బూజ్యులయినమీకు స్వాధీనురాలనై యుండెదను.

మన్మ—(సంతోషముతో) కృతజ్ఞురాలా! ఇట్లుగూడఁ జెప్పవలెనా? (తిన్నగా నిరూపించి వితర్కించుకొనుచుఁ దనలో)

చ. తనులతసౌకుమార్యకంబుఁ గనుదమ్ములసాళసవీక్షితంబు, లా
నవశశిరమ్యకాంతియు ఘనంబగుప్రేమభరోక్తు, లవ్వియే
యవఁ దగియుండియు న్మతులు నామెయొ లాతియొ యంచు నీతతిన్
మనమున సందియం బొకటి మానక కల్గు నిదేమిహేతువో!

అట్లుగాదు. రాక్షసాభిమర్శమున మిక్కిలి యలసియుంటచేత నిట్లు సందేహింపఁబడుచున్నది గాని వేఱొండు గాదు. స్వజనదర్శనముచే నీమె స్వస్థత నొందవచ్చును. కాఁబట్టి యీమె నిప్పుడు తల్లిదండ్రులకడకుఁ దీసికొని వెళ్లుదును. (ఇట్లు రథముతో మఱలుచు, నాకసమువంకఁ జూచి) కోకిలక! ఏమీ! ప్రస్తుతము పూజ్యుఁ డయినరాగునియింటనే యున్న భగవతితోను, రతియొక్క గురుజనముతోను, మేము వచ్చుచున్నవర్తమానము చెప్పుటకు వెళ్ళెద నను చున్నావా? సరే! భద్రా! అట్లుచేయుము. ఇదిగో నేనును నీవెనుక నేవచ్చెద. నాయం దకారణవాత్సల్యము గలభగవతి నాకు వందనీయ గదా! (ఇట్లు కొంచెము దూరము గడచి యావతితోఁగూడ రాగునిగృహమునకుఁ బ్రవేశించుటను నటించుచున్నాఁడు.)

(తరువాత రతిచేతను నామెతల్లిదండ్రులచేతను నామెసఖులచేతను సేవింపఁబడుచు సర్వార్థసాధికయు వశినియుఁ బ్రవేశించుచున్నారు.)

సర్వార్థసాధిక—(తనలో)

ధృవకోకిల. రతియుఁ గంటఁను నొండొరుల్ గడురక్తి నొందిరి, యుక్తిచే
హాతమునొంచెను మధ్యఁ గ్గనయట్టియొగ్గఁక-వీరికిన్
గుతుక మొప్పఁగ వేగ పెండ్లియుఁ గూర్చి నేఁ గృతకృత్యనై
సతత మంబపదంబుఁ గొల్వఁగ సాగుదుం గడు వేడ్క-తోన్.

మన్మ—(సర్వార్థసాధికను నిర్వర్ణించి గౌరవముగాఁ దనలో) ఆహా! భగవతి మహానుభావురాలు గదా! ఇదిగో! ఈమెయొక్క—

క. కనుఁగన దయారసార్ద్రము
మన మతినిర్మలము నిరుపమము రూప మొహో!
ఘనతరతేజం బెన్నం
గను తేజస్వులకుఁగూడఁ గడుదుర్లభమౌ.

(రతిని జూచి యబ్బురముతో) ఈమె యెవ్వతెయో నాప్రియురాలివంటిరూపము నే పూని భగవతిపార్శ్వమం దలరుచున్నది! ఏమీ!

ఉ. ఈమె యెయామె యయ్యో నొకో! యీమెగ నామెయొ మారెనొక్కఁడు
క్లైమొకొ రెండుప్రక్కలన నిద్దఱు నొప్పుదు రొక్కరీతి, నా
కామినివంటి నాతి మఱి గల్గునె యెందుఁ, బ్రియాస్వరూపమై
నామదిఁ దోఁచు లోకమున నాకిదియున్ భ్రమచేతఁ దోఁచునో!

కాదు; మిక్కిలి తెలివితో నున్ననాకు స్పష్టముగా నెదుటఁ గన్పట్టుచుండఁగా నిఁక భ్రాంతి యనుకొనుటెట్లుగాను?

రతి—(మన్మథుని జూచి యానందముతో) ఇదిగో! మహాభాగుఁడు నాభాగ్యవశమున మఱల సుఖముగా వచ్చినాఁడు; ఈజవ్వని యెవ్వతెయో! పోలికచేత నావలె నే యుండి నాకుఁగూడ దుర్లభమైయున్న మహాభాగునిపార్శ్వసుఖము ననుభవింపుచున్నది! (వితర్కించుకొనుచు వ్యామోహముగా)

ఉ. ఏనె యగణ్యపుణ్యమున నీతని దగ్గఱియుండఁ గంటినో
పూనిక నాదుచెంగటనె పొందెనొ యాతఁడె ప్రేమచే, నయో
తానెటు గల్గనేర్చు నిది తద్దయు పెద్దలు సూచుచుండఁగాఁ
గానఁ బ్రియుండు నేనుబలెఁ గ్రాలెడువేఱొకజంట యిద్దియున్.

(ఇట్లబ్బురముతో నిశ్చలముగా నిలుచుచున్నది)

మాయా—(రతిని జూచి తనలో) నేనార్యురాలిదగ్గర నున్నానేమి? (విమర్శించి) అయ్యో! నేనిక్కడనే యుండియు నీలాగున వ్యామోహము నొందుచున్నాను. ఇదిగో మహాభాగుఁడు నాచెంగటనే యున్నాఁడు. మఱి యీ నీమె యెవ్వతెయో యీర్ష్యచే నెఱ్ఱఁబడినకన్నులతో నన్నుఁ జూచుచున్నది. అట్లుకాకున్నచోఁ దనకుఁ దనయందే యసూయ గలుగుట సంభవించునా? కాఁబట్టి యీమె యెవ్వతెయో యన్యురాలే; రూపముచేతమాత్రము సరిగా నన్నే పోలియున్నది.

సఖులు—(మన్మథునిజూచి జనాంతికముగా) పుణ్యవశమున మనప్రియసఖిజీవితము మఱలఁ జేరినది. (మాయావతిని నిరూపించి) ఏమి సునయనుఁగుసెచ్చెలి యింతలోనే కన్యాత్వమంతయు విడిచిపెట్టి యింతదిట్టదనము నొందినది! ఇదిగో! గురుజనము నెదుటనే వల్లభుని చెంత జంకులేక యెట్లు నిలిచియున్నదో!

రాగుఁడు—(మాయావతీమన్మథులను జూచి హర్ష సంభ్రమములతోఁ గూడిన యౌత్సుక్యముతో) ఆహా! నాముద్దుబిడ్డయును, విజయమునొందె కుమారుఁడును వచ్చినారు గదా!

ముదిత—(కన్నీరు నించుచు) ఇదిగో! నాముద్దుపట్టి యదృష్టవశమున మఱలమృత్యువు నోటినుండి విడిపింపఁబడినది.

(ఇద్దఱును వేగముగా నెత్తుకొనఁబోవుచున్నారు)

రతి—అమ్మ! బాబయ్యగారూ! ఇదిగో! నేనిక్కడనే యున్నాను. (ముదితయు రాగుఁడును వైలక్ష్యము నభినయింపుచున్నారు.)

వశిని—(తనలో) మాయావతిని నిర్మించినది తెలిసియుండియు వీరిరువురు నిట్టివ్యామోహమే పొందుచున్నారేమి?

సర్వార్థసాధిక—(మన్మథుని నిర్వర్ణించి వాత్సల్యముతోఁ దనలో)

తే. గీ. పూని పగతుర నెల్లను బొలియఁజేసి
మేనిపైఁ గత్తినరకులు మెండు గలిగి
యున్నకందుని గన్న నాయుల్లమునకు
నెలమియును గొంతవగపును గలుగుచుండె.

మన్మ—(ఎదుటఁజూచి) ఇదిగో! భగవతి విశాలమయినదృష్టిచే నన్నుఁజూచుచున్నది. ఇరుగో! వీరిగురుజనులు. వీరిని సమీపింతును. (అట్లు వెళ్లి) భగవతీ! మన్మథుఁడనగు నేను నమస్కరింపుచున్నాను.

సర్వా—వత్సా! నీయభిమతము సిద్ధించునుగాక!

మాయా—పూజ్యురాలిపాదములకు మ్రొక్కుచున్నాను.

సర్వా—బాలికా! నీవుఁ దగినపెనిమిటి నొంది సుఖింతువుగాక! (ముదితారాగులను గన్పఱచి మాయావతీమన్మథులతో) వత్సలారా! ఇదిగో! వీరు రతితల్లిదండ్రులు; వీరికి నమస్కరింపుఁడు.

(ఇద్దఱును నట్లుచేయుచున్నారు.)

రాగుఁడు—కుమారా! అమ్మాయీ! చిరంజీవులరై వర్ధిల్లుఁడు.

ముదిత—మీకు సుఖము గలుగునుగాక!

సర్వా—(ముదితారాగులతో) మహాభాగులారా! మాయావతి యనుపేరు గలిగియీ కన్నియ, రతి నాయసురాధమునుండి విడిపించుటకుగాను నాచే యోగప్రభావమువలన నిర్మింపఁబడినది. కనుక న్యాయముచేత నీకెంటియును మీకుఁ గొమార్తె వంటిదే.

మన్మ—అన్నా! ఏమి! భగవతిమాహాత్మ్యము! నాయందింత ప్రేమయును!

రతి—(తనలో) ఏమీ! భగవతి కావాయందలి పక్షపాతము.

రాగుఁడు—(విశ్వాసముతో) భగవతీ! పూజ్యురాలవగు నీయానతిచొప్పున నడిచికొ నుటకు సందియమేమున్నది? (మాయావతిని దొడపై నిడుకొని శిరస్సు మూ ర్కొనుచున్నాఁడు.)

ముదిత—కూఁతునకు జీవితము నిచ్చినమాయమ్మా! ఇటు రమ్మ. (అని ప్రేమపూర్వ కముగా నామెను గౌఁగిలించుకొనుచున్నది.)

సర్వా—(రతితో) వత్సా! ఈమె నీచెల్లెలు; ఈమెను బ్రీతిగ్రహింపుము.

రతి—(మాయావతిని జేయి వట్టుకొని దగ్గరకుఁ దీసికొనుచున్నది.)

మన్మ—(రతిమాయావతులను నిరూపించి కోరికతో)

ఉ. వీరల నిర్వురన్ సరిగ వేగమె పెండిలి యాడఁగల్గినన్.
వీర లనూయ లేక కడుఁబేర్మి మెలంగుచు నుందురేని, నే
వీరలఁ గూడి లేర్మిగుల వేడుకతోఁ బువుబాన్పునన్ సుఖా
పారత నుందునేని నిరుపక్రమలక్ష్మియు సార్థకం బగున్.

మాయా—(వితర్కించుకొనుచు వ్యామోహముగా) శర్మిష్ఠవలెఁ బరావర్జనీభూత యగునాకీమహాభాగునితో సమాగమము దుర్లభమయినదిగాఁ దోఁచుచున్నది. కానిమ్ము భగవతి వాత్సల్యముగలది గదా!

సర్వా—(ముదితారాగులతో) మహాభాగులారా! ఈమాయావతియును గుమారమన్మథు నే పెనిమిటినిగాఁ బొందఁదగినది.

రాగుఁడు—భగవతియానతిచొప్పుననే జరుగునుగాక!

ముదిత—(సాంగీకారముగా) ప్రియసఖియనుమతి యెట్లో యట్లే యగుఁగాక!

సర్వా—(రతితో) వత్సా! కుటుంబభారము వహింపవలసినదాన వగునీ వీమెను నీతఱు వాతిదానినిగాఁ జూచుకొను చుండవలయును జుమీ!

రతి—(వెల్లడి నొందనియీర్ష్యతో) భగవతియానతిచొప్పున నడుచుకొనవలసినదాననే కదా?

సఖులు—(వైమనస్యముగాఁ జెయిచాటు చేసికొని) మనయనుఁగుచెచ్చెలికీహృదయ శల్య మొకటికూడ సంభవించిన దేమి?

మన్మ—(ఆనందముతోఁ దనలో) అహా! యేమి! భగవతిభావజ్ఞత! నామనస్సునందలి కోర్కెను సరిగా నానతిచ్చినది.

మాయా—నేను కృతార్థురాల నయితిని. భగవతి తానుజేసిననిర్మాణమును సార్థక మయినదానినిగాఁ జేసినది.

మన్మ—(మాయావతిమూలముగ రతికిఁ దనయందుఁ బ్రేమకలుగఁగా నున్నట్టునిరూపించి)

ఉ. మానిని, చెంతనున్న హితమానినియంసమునందుఁ దక్కెచే
ల్కొనుక బాగుగా నిలిచి యస్మితవక్త్రముచేతఁ దానుదా
నీనతఁ దెల్పుచుండెఁ గదుఁ జెల్వగఁ బ్రక్కకుఁ ద్రిప్పి రక్తిమన్
బూనినప్రాంతమున్ బిరుపుఁ బొందిన నన్నుమగల్గువాము నే
త్రానఁ గనుంగొనందొడఁగెఁ దా నను ప్రియుఁ బోలె నన్యగాన్.

మఱియు—

మ. తరుణీమాళి, తిరఃప్రసార మచలత్తారం, బరాళభ్రు, వ
త్యరుణచ్ఛాయ, మపాంగసంకుచిత మానక్షిం గనం బూనెఁ దా
సరసన్ నిల్చినయీమె నాను జగతిన్ సాపత్న్యకం బాత్మసో
దరియం దైనను నోర్వఁజాలరు గదా! తథ్యంబుగా మానినుల్.

అయినను దనకుఁ దానుగ బయలువెడలుచున్నదియై యీమెకు నాయందుఁ గల యనురాగము తెల్లమగుచునే యున్నది.

చ. వనిత, పరిహాసముం గడపివచ్చినసన్నిపు దాక్యసన్నిధిన్
గని ముద మెట్టులో పయికిఁ గన్పడనీయక మాటు చేసె; నై
నను నతిగూఢమై చెలిమనంబున నుండుట నే నెఱింగితిన్
ఘనపులకాంకురోద్గమము గల్గి తదంగ మలంకరించుటన్.

సర్వా—(వశినితో) వత్సా! మహేంద్రసహితుఁ డైనపూజ్యుఁడగునుపేంద్రునితో నే నిట్లు చెప్పితి నని చెప్పుము. "ఆర్యా! ఇప్పుడే ప్రశస్తమైనముహూర్త మని దైవజ్ఞులు చెప్పుచున్నారు. కాఁబట్టి కుమారమన్మథునికి రతిమాయావతులను వివాహము చేయుటకు, నీయుద్యానవనమందుఁ గల్పకద్రుమముక్రింద వేయించి యలంకరించినకళ్యాణమంటపమునకుఁ బూజ్యులయినమీరు పరివారసహితముగా విచ్చేయవలయును."

వశిని—చిత్తము (అని వెళ్ళి మఱల నొకపురుషునితోఁ గూడఁ బ్రవేశించి) భగవతీ! అనుజసహితుఁ డగుపురుషోత్తముఁడు తమరు పంపించినశుభవర్తమానము విని మిగుల సంతసించి యాప్తుఁ డగునీతని దమయొద్దకుఁ బంపించినాఁడు.

పురుషుఁడు—(నమస్కరించి) అమ్మా! పూజ్యులగునింద్రుఁడుగారిట్లు మనవిచేయు మన్నారు. "కుమారిక లగుదేవసేనేంద్రసేనలను బూజ్యుఁ డయినమహాసేనున కిచ్చి వివాహము చేయుటకు నిశ్చయించినాము. కనుక ముందుగాఁ బూజ్యు

లయినతమరు రతిమన్మథులనుఁ మిత్రుఁ డయినరాగునిని వెంటఁబెట్టుకొని వచ్చి యీవివాహమహోత్సవమును జూచి యానందించి తరువాత రతిమాయావతుల కుఁ బాణిగ్రహణమంగళము జరిగించిన ననుకూలముగా నుండును."

సర్వా—(సంతోషింపుచు మన్మథునితో) కుమారా! నీకును నీప్రియురాలికిని మిక్కిలి యుపకారము చేసినతారకారాతివిషయమునఁ బూజ్యులయినయయ్యిరువురును బాగుగా యోచించినారు. అదియుఁగాక కన్యాప్రదాన మయినతరువాత వధూపరిగ్రహము చేయుట పెద్దలయాచారముగూడ నై యున్నది. కనుక చిర కాలమునుండి చూడఁగోరుచున్న గురుజనమును సందర్శించి వారిని సంతోషపెట్టు ము. (పురుషునిఁజూచి) భద్రా! మహేంద్రుఁడుగారితో "నేనును రాగుఁడును రతిమాయావతులపెండ్లిపనులతొందరలో నున్నారము గనుక యామహోత్సవ ము నిక్కడనుండియే విని చెవులకుఁ బండువు చేసికొందుము."

మన్మ—చిత్తము. (నమస్కరించి పురుషునితో వెళ్లుచున్నాఁడు.)

రతిమాయావతులు—(సోత్కంఠముగాఁ దమలో) హృదయమా! అయిదాఱునిముస ములలోనే నీకోరిక నెఱవేఱుటకు సిద్ధముగానుండినను నీవింతఁగాఁ దొరపడు చుంటి వేమి? అగును నిజమే. పాక ముడికినదాక నోర్చియు వేఁడిమి చల్లాఱు పఱకును దాళుట కష్టముగా నుండునుగదా!

(తెరలో దివ్యదుందుభిధ్వనియుఁ బూవులవానయు)

సర్వా—(ఆలకించి సంతోషముతో) ఇంద్రసేనాదేవసేనలపాణిగ్రహణవిధానము పూర్తియైన ట్టున్నది.

వశిని—(చెవి యొగ్గి సంభ్రమముతో) భగవతీ! వీథియందంతటను వ్యాపించిన నానావిధవాద్యములవలనఁ గలుగుమంగళధ్వని క్రమముగా నెక్కువయై వినఁ బడుచుంటచేత బంధువర్గము సమీపించుచున్నట్టు తోఁచుచున్నది.

సర్వా—శుభకార్యములందుఁ దత్వరాతిరేకమే యెక్కువగా శోభించుచుండునుగదా! (ముదితారాగులతో) మహాభాగులారా! మీరు పెండ్లికూఁతులను దీసికొని వెళ్లి వివాహవేదికయందు సిద్ధముగా నుంపుఁడు.

ఇద్దఱును—(వశినిగాక తక్కినవారితో వెళ్లుచున్నారు.)

(తెరలో) అమ్మా! క్షేమమా!

సర్వా—(వారివంకఁ జూచి) ఇదిగో! బంధుగు లందఱు వచ్చినారా! రండు. మహా ర్హము లయినయీయాస్తరణములమీఁదఁ గూర్చుండుఁడు.

(వారు కూర్చున్న తరువాత తానును శ్రీరామవిజయుని గూర్చున్నది.)

(తెరలో) (పురోహితు లిద్దఱిలో నొకఁడు చదువుచున్నాఁడు.)

మ. నిజవంశంబు నగేంద్రుఁ డెన్న మునిసాన్నిధ్యంబునం బెండ్లిలో
నజుఁ డయ్యాశునివంశవర్ణనము సేయన్ లేక, దామానమున్
భజియింపన్, నగి, దానసే తెలిసెఁ దద్భవ్యశ్యా మానా జకీ!
నిజమం జెల్లగు పలుకు-పలుకులు శుభానీకంబు మీకీవుతన్!

వశిని—(ఉల్లాసముతో) భగవతీ! ఇది వధూవరులకు వాగ్దానసూచక మయినపద్యము.

(మరలఁ దెరలో)

(మంగళవాద్యములధ్వని యొగతరువాత)

లెంపవయతఁడు—

చ. వలనుగ నంబికేశులవివాహప్రవేళ నెసంగె నెవ్వి ఒల్
చెలువుగ వారిదోయిటను జెమ్మటఓంచువులట్టు, లొండొరుల్
దలలనుగూర్పఁ జందుక్రిక డఁ దారకలుంబలె, వ్యాప్తిఁ జెంది వే
ల్పులిడినపూలఁబోలె, నలము తేము లీవుత మీకు మేళులన్.

సర్వా—(ఆనందముతో) కుమారికలకుఁ బాణిగ్రహణమంగళము జరిగినదిగదా!

(మరలఁ దెరలో)

పూజ్యురాలా! కుమారునిశుభకార్య మనుకూలముగా జరిగినది; ఇఁక మిమ్మిరవులకు వెళ్లుట కంగీకరింపవలెను. ఇదిగో! వధూసహితుఁ డగుమన్మథుఁడు మీకు నమస్కరించుట కిట్లు వచ్చియున్నాఁడు.

సర్వా—(ఆనందమును గన్నులయందు బందుగులతో) పూజ్యులారా! మంచిది. మీ కృపలు వచ్చుటచేత నీశుభకార్యము మిక్కిలి చక్కగా జరిగినది. (తరువాత పెండ్లికుమారులవేషముతో నున్న ప్రియురాండ్రిరువురితోఁ గూడి, పెండ్లికొడుకగుమన్మథుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

[illegible]—(ఆనందింపుమన దనలో) ఓహో! దైవానుకూల్యము చివరకు మిక్కిలి చక్కగా ఫలించినది గదా!

తే. గీ. కలిగె నొదల శుభాంకురోద్గమము, పిదపఁ
గలిగె పఱపు తదున్మేషకాలనుండు
మఱలఁ దత్పరిహారంబు, మఱియు నిప్పుడు
మేలులోపల మేజోండు మేలు గలిగె.

సర్వా—(భార్యలతోఁ గూడియున్న మన్మథుని జూచి సంతోషముతోఁ దనలో)
ఇట్లనుచున్నది—

క. రతి యొక వైపున మాయా
వతి యొక వైపునఁ జెలంగ భాసురపార్శ్వ
ద్వితయుఁడయి ఫాల్గుణీసం
గతుఁ జగుశశివోలె మిగులఁ గ్రాలెదు నౌరా!

మన్మ—(వినయముతో సమీపించి భార్యలతోఁగూడ సర్వార్థసాధికపాదములపై వ్రాలి నమస్కరింపుచున్నాఁడు.)

సర్వా—(ప్రేమతో వారిని లేవనెత్తుచు.)

క. ఏలుము వత్స! సరిగ నిరు
వేలల నలజలధివోలెఁ బ్రియల నిరువురన్
బాలలు! భజింపుఁ డితనిన్
జాల నభిన్నతను గంగ జమునయుఁ బోలెన్.

మన్మ—భగవతీ! పెక్కు లుపచారవాక్కు లేటికి? అన్ని విధములచేతను బిల్లల మగు మాయందు నీకుఁ గలప్రేమాతిశయమునకుఁ దగినట్టుగా నొనరించితివి గదా!

సర్వా—కుమారా! పరదేవత "వత్సా! వివాహమయినతరువాత కుమారమన్మథునికి నాదర్శనమునకు సమయ మిచ్చి కృతార్థుని జేయుదు" నని యానతిచ్చినది.

మన్మ—(మిక్కిలిసంతోషముతో) భగవతీ! ధన్యుండ నయినాను. ఇఁక నింతకంటెను వీనికిఁ గావలసిన దేమున్నది?

సర్వా—వత్సా! ఇఁక మనము జగజ్జనని పాదసందర్శనమునకు వెళ్లుదమురండు (ఇల్లు లేచి తెరవైపుగాఁ దిరిగి రాగునితోఁగూడ నడుచుచు సమున్నతగోపుర మగు శ్రీపురమును జేరి ముందువైపుగాఁ జూడ్కులు వఱపి) కుమారా! ఇదిగో! అనర్ఘ్యమణిగణసుందర మగుజననిమందిరము. ఇందుఁ బ్రవేశింతము.

( ఇట్లందఱును బ్రవేశమును నటింపుచున్నారు. )

మన్మ—(అంతటను జూచి యబ్బురముగాఁ దనలో)

తే. గీ. స్వర్గకాంతి నెసంగెడుజననిగృహము
చేఁ దిరస్కృత మగునర్యమాదితేజ
మనిన నది యింక నితరుల కలవి యౌనె
కనుల నొక్కింతయుఁ జేఱి కనుట కెన.

(తరువాత సింహాసనమునందుఁ గూర్చున్న కామేశాంకగత యగుదేవియుఁ బరివారమును బ్రవేశింపుచున్నారు.)

దేవి—(సర్వాగ్రసాధిక ననుసరించి నమ్రులై యున్న వధూవరులను జూచి తనలో) ఈ చిన్నది నాయానతిచొప్పున జరిగించుకొని వచ్చినది. కుమారుఁ డగుమన్మథుఁడును మనోరథసిద్ధి నొందినాఁడు. (అనుగ్రహముతో వారిని జల్లనిచూపులఁ జూచుచున్నది.)

మన్మ—(దూరమునుండియే శ్రీరాజగదంబను జూచుచు హర్షముచే గగుర్పొడిచినదేహముతో సంభ్రమము నొందుచు)

ఉ. గండముఖాఖిలాంగములఁ గ్రాదుకాంతులు వింతమీఱి, లే
యెండయుఁ బోలె దిక్కుల రహింపఁగ, నీ లలితాంబ యీతఱిన్
గొండొకరమ్యశోభఁ గని కోరిక దీఱఁగఁ గానరాచు బల్
పండుగ సేయుచుండెఁ గద భాగ్యవశంబునఁ గన్నుదోయికిన్

ఓహో! మిక్కిలి కృతార్థుఁడ నైనానుగదా; ఇదిగో!.

ఉ. సారములై సితాబ్జసహచారములై బహుశీతతాసుధా
సారములై యసంసృతివిచారములై మిగులన్ దయారసా
ధారములై తమంతనె యుదారము లైనకటాక్షవారముల్
స్మేరముగా జగజ్జనని చిలుకుచు నున్నది నాపయిన్ దయన్.

(ఇట్లు వేగముగా సమీపించి భార్యలతోఁ గూడ దేవిచరణారవిందములయందు రత్నములు చల్లి సాష్టాంగముగా నమస్కరింపుచున్నాఁడు.)

సర్వా—(నమస్కరించి లేచి) అమ్మా! ఇదిగో! వధూసహితుఁ డయినకుమారమన్మథుఁడు నమస్కరింపుచున్నాఁడు.

దేవి—బిడ్డలారా! సంతోషముతో వర్ధిల్లుఁడు.

సర్వా—పిల్లలారా! లెండు. జగదంబకు మీయందు మిక్కిలి యనుగ్రహమువచ్చినది.

మన్మ—(పత్నీసహితముగా లేచి దోసిలి పట్టి యానందగద్గదస్వరముతో)

చ. జనని! యజాదు లౌదల నజస్రముఁ దాల్చుభవత్పదంబుఁ గా
దని యెవఁ డాశ్రయించు హృదయంబున నీచపుటన్యదైవమున్
ఘనతరమై జరామరణఘస్మర మాసుధ చెంత నుండఁగాఁ
గొనక, విమూఢుఁడైన మదిఁ గోరునె గ్రోల మరీచికల్ తమిన్.

(ఇట్లు స్తుతిచేసి నమస్కరింపుచున్నాఁడు.)

దేవి—(అనుగ్రహముతో) వత్సా! నీకేమి కావలెను?

మన్మ—తల్లీ! ఇదే (ఇట్లు సగము పలుకుచునే ప్రమోదముచేత నయినపరవశమును నటించుచు.)

చ. కచమునఁ జంద్రికాంతియు మొగంబున లేనగవున్ మనంబునం
బ్రచురదయారసంబుఁ గుచపాళి సమున్నతి హెచ్చుసత్కటిన్
సుచరణమందు మార్దవము శోణపువస్త్రము బంధుజీవస
ద్రుచి గలనీదుభవ్యమగురూపు సదా గనఁజేయు మంబికా.

దేవి—వత్సా! ఇక్కడనే నామందిరసమీపమం దున్నశృంగారపరిఘ మందే యుండి సదా మద్దర్శనలాభము నొందుచుండుము.

మన్మ—(ఆనందబాష్పములతో) అమ్మా! మేలు లన్నియు నిప్పుడు నాకు లభించినవి.

దేవి—కుమారా? ఇంకను నీకేమికావలయునో చెప్పు మిచ్చెదను

మన్మ—(ప్రణామపూర్వకముగా) తల్లీ! నాకింతకంటెఁ గావలసినకోరిక యేమున్నది

శా. పూముల్కుల్ గొని గెల్వ నయ్యొ హరునిన్ బోరన్ దృటిన్ లీలగా
నామాయావిని శంబరుం దునుమగా నయ్యెన్, రతిం గోరుచో
నీమాయావతియున్ లభించె నిఁకనే తీర్పింపఁగా నున్నదే
శ్రీమత్పావకసన్నిధిస్థితుఁడనై చెల్వొందు నాకిప్పుడున్.

అయినను దానీభరతవాక్యము సిద్ధించును గాక.

శా. వైరుల్ లేక సదా సధర్ము లగుచున్ వర్ధిల్లుతన్ రాజు లా
సారం బిచ్చుచు నుండుతన్ జలదముల్ సస్యానుకూలంబుగా;
ధీరోదాత్తసుధీగృహంబుల సదా దీపించుతన్ లచ్చి; స్వా
చారం బొప్పఁగ సర్వవర్ణములు బల్ సౌఖ్యంబునం బొల్చుతన్.

(ఇట్లందఱును వెళ్ళుచున్నారు)

ఇది సత్యవోలు కామేశ్వరరాయనిచేఁ రచింపఁబడిన
రతిమన్మథనాటకమునందుఁ బంచమాశ్వాసము
సర్వమును సంపూర్ణము.

— — — —